వ్యాస మంజరి

విజయలక్ష్మీ పబ్లికేషన్స్
ప్రచురణ నెం. 13

ప్రథమ ముద్రణ: మే 1989

వెల రు. 8-00

ముద్రణ :

లక్ష్మీ ప్రింటింగ్ ప్రెస్
సిరిసిల్ల—505 301.
జి॥ కరీంనగర్

రేగులపాటి కిషన్‌రావు

రచనలు

వ్యాస మంజరి
రవిబింబం
మల్లెమొగ్గలు
కొత్తపాటలు
స్వామీజీ కథలు
కవితా పుష్పాలు
ఈతరం కథలు
ప్రగతి పాటలు
ప్రేమకు పెళ్ళెప్పుడు
సంఘర్షణ
భాగవత విషసర్పం
పతివ్రత ఎవరు? వాణిశ్రీ
ఆమె వితంతువు కాదు

# వ్యాసాలు

సాహిత్య ప్రక్రియలు అనేకం....

పాటలు, పద్యాలు, కథలు, నవలలు, నాటకాలు, ఇలాంటి ఎన్నో రకాల సాహిత్యప్రక్రియలలో వ్యాసప్రక్రియ ఒకటి

వ్యాసప్రక్రియ విశుద్ధమైనది, విశిష్ఠమైనదికూడా!

వ్యాసప్రక్రియ విశిష్ఠమైన ప్రక్రియ అని మనం అంగీకరిస్తే దాని విశిష్ఠత ఏమిటో వివరించాలి

"వ్యాసం వజ్రాయుధం లాంటిది„ అన్నారు ఒక మహాకవి.

రచయిత పాఠకుల పాలిటి దేవుడని భావిస్తే పాఠకులను బాధించే అజ్ఞాన రాక్షసిని మట్టుపెట్టడానికి అతడు వ్యాస వజ్రాయుధాన్ని ప్రయోగించాలి. ప్రయోజనాన్ని సాధించాలి పాఠకులకు ప్రమోదాన్ని కలిగించాలి.

" వ్యాసం దివ్యమైన ఔషధం " అన్నాడొక పెద్ద మనిషి.

పేదలైనా, నిరుపేదలైనా, ధనికులైనా. ధనికులనుమించిన ధనికులైనా, ఔషధం తియ్యగా ఉన్నా, చేదుగా ఉన్నా త్రాగాలనిపించినా, త్రాగాలనిపించకపోయినా, రోగ నివారణ కావాలంటే ఔషధం సేవించడం తప్పనిసరి. అలాగే అజ్ఞానమనే జబ్బు తొలగిపోవాలంటే వ్యాసమనే ఔషధం దీక్షతో ఉపయోగించాలి.

ఇది పెద్ద మనిషి చెప్పిన చిన్న మాటలోని పెద్దరహస్యం.

రాగాలు తీస్తూ పాటలు పాడితే, పద్యాలు చదివితే పదజాలం పెరుగవచ్చు. పరమానందం మిగులవచ్చు.

కథలు, నవలలు చదివితే చదువుపట్ల కుతూహలం పెరుగవచ్చు విషయ వివరణలో నవ్యత కనిపించవచ్చు.

నాటకాలు చదివితే కాదు చూస్తే కనులముందే నాటకం కనిపించవచ్చు. అమృతం రుచి చూచినట్టు అనిపించవచ్చు.

కాని వ్యాసాలు చదివితే అజ్ఞానం తరుగుతుంది. విజ్ఞానం పెరుగుతుంది.

అందుకే మనం సర్వదా వ్యాసాలు చదువుదాం
వ్యాసాలు చదివితే—
మనసు వికసిస్తుంది.
ఉల్లాసం కలుగుతుంది
ఆలోచన వెలుగుతుంది
అభ్యుదయం పెరుగుతుంది
అందుకే—
చదువుదాం చదువుదాం చదువుదాం
క్రొత్త క్రొత్త వ్యాసాలు చదువుదాం
పద ముందుకు చదివేందుకు
పద పద పద పద పద

# ఉద్యోగం

"ఉద్యోగం పురుషలక్షణం" ఇది ఒకనాటి మాట. "ఉద్యోగం మానవ లక్షణం" అనేది నేటి మాట. ఉద్యోగం అంటే సమాజ అవసరాన్ని తీర్చే ఒక పని అని మనం అర్థం చెప్పుకోవచ్చు. కాని ఉద్యోగం అనే పదం సరిగ్గా ఈ అర్థం తోనే వ్యవహరించబడడం లేదు.

నెల రోజులు పనిచేసి ఆ కాలానికి ఒకరి నుండి జీతం తీసుకునే పనినే ఉద్యోగం అంటున్నాము. ఒకరి నుండి అంటే ఇక్కడ ప్రభుత్వం నుండి కావచ్చు, కంపెనీ యజమాని నుండి కావచ్చు....

ఏ వృత్తిని అవలంభించే వ్యక్తి అయినా సమయ నియమము పాటించుట అవసరము. వృత్తి పట్ల శ్రద్ధాసక్తులు కనబరచుట అవసరము.

సమయ నియమము పాటించని వ్యక్తి, సంస్థకు ఉన్నటువంటి నియమ నిబంధనలు పాటించని వ్యక్తి, వృత్తి పట్ల శ్రద్ధాసక్తులు కనబరచనివ్యక్తి సమర్థుడైనప్పటికీ పొందగలిగినంత గౌరవం పొందలేడు. ఈ నియమాలను పాటించే వ్యక్తి కొంత ఎక్కువగానే గౌరవం పొందుతాడు.

ఏ ఉద్యోగి అయినా తన ఉద్యోగ ధర్మాలను సక్రమంగా నిర్వర్తించాలి. తన వృత్తిలో సామర్థ్యాన్ని పెంపొందించుకొనుటకు శక్తివంచన లేకుండా కృషి చేయాలి.

ఏ ఉద్యోగం చేసేవారిలోనైనా గుణదోషాలు ఉంటూ ఉంటాయి. సమర్థత, అసమర్థత అనేవి కూడా కన్పిస్తుంటాయి. సమర్థత శాతం ఎక్కువగా వున్న వ్యక్తి రాణిస్తాడు. అసమర్థుణ్ని అందరూ చులకనగా చూస్తారు.

ఉద్యోగాలు ప్రధానంగా రెండు రకాలుగా పేర్కొనవచ్చును. గవర్నమెంటు ఉద్యోగాలు, ప్రైవేటు ఉద్యోగాలు, గవర్నమెంటు

ఉద్యోగాలకు రక్షణ ఎక్కువ అని, ప్రైవేటు ఉద్యోగాలకు రక్షణ తక్కువ అని లోకజ్ఞానం ఉన్న వాళ్లు చెపుతూ వుంటారు.

అనేక అధికారాలు ఉన్నటువంటి ఉద్యోగాలు కొన్నైతే సాధారణ అధికారాలు ఉన్న ఉద్యోగాలు కొన్ని ఉండగా, అసలు ఎలాంటి అధికారాలు లేకుండా కేవలం పనిచేసే ఉద్యోగాలు చాలా ఉన్నాయి.

ఉద్యోగుల జీతభత్యముల విషయములో కూడా అనేక వ్యత్యాసాలు కనిపిస్తూ వుంటాయి. పై స్థాయి ఉద్యోగులు తమ అవసరాలు తీర్చుకొంటూ మిగిలిన డబ్బును బ్యాంకుల్లో దాచుకొంటూ వుంటారు. క్రిందిస్థాయి ఉద్యోగస్థులకు కనీస అవసరాలు తీర్చుకోవడానికి కూడా డబ్బు సరిపోదు.

పరిపాలనా కార్యక్రమాలను నిర్వహించే ఉద్యోగస్థులు కొందరు, ఆయా వస్తువులను ఉత్పత్తి చేసే ఉద్యోగస్థులు కొందరు, ఆయా వస్తువులను రవాణా చేయడానికి తోడ్పడే ఉద్యోగస్థులు కొందరు, సమాజానికి అవసరమైన సేవలు చేసే ఉద్యోగస్థులు కొందరు ఇలా కొన్ని రకాలుగా ఉద్యోగస్థులను పేర్కొనవచ్చును.

సులభంగానూ, అక్రమంగానూ డబ్బు సంపాదించడానికి అవకాశమున్న ఉద్యోగాలను మొదటి రకంగానూ, పనిని బట్టి డబ్బు సంపాదించే ఉద్యోగాలను రెండవ రకంగానూ, ఎంత పనిచేసినా జీత భత్యములలో మార్పు లేని ఉద్యోగాలను మూడవ రకంగానూ పేర్కొంటే మొదటి రకం ఉద్యోగాలను పొందాలనే అభిప్రాయం, తాపత్రయం కొందరిలో కొట్టవచ్చినట్టు కన్పిస్తూ వుంటుంది.

ఉద్యోగ ధర్మాలను సక్రమంగా పాటిస్తూ పనిచేసే వాళ్లు ఏ సంస్థలో వుంటే ఆ సంస్థ అభివృద్ధి చెందుతుంది. "సోమరిపోతు ఉద్యోగులు" ఏ సంస్థలో ఉంటే ఆ సంస్థ దెబ్బ తింటుంది.

పనిచేసే శక్తివుండి, పనిచేయాలనే కోరిక వుండి, పనిచేయడానికి అవకాశాలు లేనివారు నిరుద్యోగులు.

నిరుద్యోగాన్ని తొలగించడానికి, అందరికీ ఉద్యోగాలు కల్పించడానికి ప్రభుత్వం ప్రణాళికలు వేయాలి. ప్రతి ఉద్యోగి తన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించడానికి ప్రయత్నం చేయాలి. అప్పుడే సమాజం అభివృద్ధి చెందుతుంది.

## చెట్లు

సృష్టి పరిణామ క్రమములో భూమి మీద చెట్లు అవతరించాయి. అవి స్వయంగా ఆహారం తయారు చేసుకుంటాయి. ఉపయోగించు కుంటాయి నిలువ చేసుకుంటాయి. మిగతా ప్రాణులన్నీ అవి నిలువ చేసుకున్న ఆహారాన్ని భుజిస్తాయి. అవి అందించే ప్రాణవాయువు పీల్చుకొని బ్రతుకు సాగిస్తాయి.

చెట్లవలన వర్షం కురుస్తుంది. వాతావరణం చల్లగా వుంటుంది. గాలి పరిశుభ్రంగా వుంటుంది.

చెట్లు పశుపక్ష్యాదులకు ఆశ్రియమిస్తాయి. ఆహారాన్ని అందిస్తాయి. అవి పూలనిస్తాయి తేనెనిస్తాయి, జిగురునిస్తాయి, చమురునిస్తాయి. బట్టలకు, కాగెదానికి కావలసిన ముడిపదార్థాలను అందిస్తాయి.

మనకు ఈనాడు భూగర్భములో లభించే బొగ్గుకు, పెట్రోలియంకు మూలకారణం చెట్లు. చెట్లవలన ఇండ్లు నిలుస్తున్నాయి. చెట్లు తమ అవతారం మార్చుకొని గృహాలలో పరికరాలై వెలుస్తున్నాయి.

నీరు సెలయేరై పడుగెత్తినప్పుడు నేల కోతకు గురికాకుండా, భూసారం చెడిపోకుండా రక్షిస్తాయి, భూసారం పెంపుకావడానికి ఆకులను అందిస్తాయి చెట్లు.

అవసరానికి ఒక చెట్టును పడగొట్టినప్పుడు నాలుగు చెట్లను నాటి పెంపుచేయడం మన ధర్మం, మానవధర్మం.

చెట్లను మనం రక్షిస్తే మనల్ని చెట్లు రక్షిస్తాయి.

వేగులపాటి కిషన్‌రావు

# పరీక్షలు

విద్యార్థులు నేర్చిన విద్యను కొలవడానికి లేదా అంచనా వేయడానికి ఉపయోగించే ప్రక్రియను "పరీక్ష" అంటున్నాము.

విద్యార్థి ఒకటవ తరగతి నుండి మాస్టర్ డిగ్రీ పొందే వరకు ప్రతి సంవత్సరం పరీక్షింపబడుతాడు.

విద్యార్థులను పరీక్షించుటకు దీర్ఘ సమాధాన ప్రశ్నలు, సంక్షిప్త సమాధాన ప్రశ్నలు, విషయాత్మక ప్రశ్నలు అనే మూడు రకముల ప్రశ్నలు ఇస్తూ ఉంటారు.

దీర్ఘ సమాధాన ప్రశ్నలు చిన్న తరగతులలో తక్కువగానూ, పెద్ద తరగతులలో ఎక్కువగానూ ఇస్తుంటారు. సంక్షిప్త సమాధాన ప్రశ్నలు ప్రతి ప్రశ్నాపత్రములోనూ కొన్ని కన్పిస్తూ ఉంటాయి. విషయాత్మక ప్రశ్నలు ప్రతి దశలోనూ విద్యార్థిని శాస్త్రీయంగా పరీక్షించడానికి ఉపకరిస్తాయి.

కఠిన ప్రశ్నలు, సాధారణ ప్రశ్నలు, తేలిక ప్రశ్నలు కూడా పరీక్షా పత్రాలలో ఇవ్వబడుతాయి.

ఎక్కువ విజ్ఞానము కలిన విద్యార్థి కఠిన ప్రశ్నలకు కూడా సమాధానాలు రాయగలుగుతాడు.

మామూలు విద్యార్థులు సాధారణ ప్రశ్నలకు తేలిక ప్రశ్నలకు సమాధానాలు రాయగలుగుతారు.

తెలివిలేని మొద్దు విద్యార్థులు తేలిక ప్రశ్నలకు కూడా సమాధానాలు ఇవ్వలేరు. వాళ్లు పై తరగతికి చేరలేరు. వాళ్ల చదువు ప్రాథమిక దశలోనో, ఎక్కడో మాధ్యలోనే ఆగిపోతుంది.

తెలివికల విద్యార్థులు పరీక్షలలో నెగ్గుతారు పై విద్యలు నేర్చి విద్యావంతులుగా, విజ్ఞానవంతులుగా గుర్తింపబడుతారు. ఉన్నత పదవులు చేపట్టి సమాజంలో గౌరవ ప్రతిష్ఠలతోపాటు డబ్బు

గడిస్తారు. సుఖిస్తారు.

పరీక్షల కోసం పట్టుదలతో చదివే విద్యార్థులు, పరీక్షలు దగ్గర పడుతున్నప్పుడు ఉత్తీర్ణులు కావడం కోసమే చదివే విద్యార్థులు, పరీక్షలంటే భయపడే విద్యార్థులు, పరీక్షలంటే పూర్తిగా నిర్లక్ష్య వైఖరి ప్రదర్శించే విద్యార్థులు మనకు కనిపిస్తూ వుంటారు. పరీక్షల కోసమే కాకుండా తరగతిలో ప్రవేశించినది మొదలు తుది పరీక్షలు అయ్యేంత వరకు దీక్షతో విద్యనభ్యసించే విద్యార్థులు కూడా మనకు కనిపిస్తూ ఉంటారు కాని ఇలాంటి వాళ్ళ సంఖ్య బహు స్వల్పం.

నిర్ణయింపబడిన మార్కులు పొందినప్పుడు, ఆ విద్యార్థి ఇచ్చిన పరీక్షలో నెగ్గినట్లు ప్రకటింపబడుతాడు.

పై స్థాయి పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు, వారి యోగ్యతా పత్రములకు, ఒక ప్రత్యేకత ఉంటుంది.

యోగ్యతా పత్రములు కలిగి వున్న విద్యార్థులు ఆయా ఉద్యోగాలకు ఎన్నుకోబడుతారు

యోగ్యత ఉన్నప్పటికీ యోగ్యతా పత్రములు లేనివారు ఉద్యోగాలు పొందలేరు.

పరీక్షలు విద్యాస్థాయిని నిర్ణయించడానికే కాకుండా ఉద్యోగాలు పొందడానికి కూడా ఉపకరిస్తున్నాయి. అందువలన యోగ్యతా పత్రములు పొందడానికి విద్యార్థులు పరీక్షలు ఇస్తూ వుంటారు.

పరీక్షలు సక్రమ పద్ధతిలో రాసి ఉత్తీర్ణులైనవారు నిజంగా యోగ్యతా పత్రములు పొందుటకూ, ఉద్యోగాలు పొందుటకూ అర్హులు. కాని అక్రమ పద్ధతిలో పరీక్షలు రాసి యోగ్యతా పత్రములు పొందిన వారు కూడా మన సమాజంలో ఎందరో ఉన్నారు. వారు కూడా ఉద్యోగాలు పొందుటకు పోటీపడుతుంటారు. ఉద్యోగాలను కూడా పొందుతూ వుంటారు.

విద్యార్థులు విజ్ఞానం పెంచుకొని పరీక్షలు రాసినప్పుడు పరీక్షా

నిర్వాహకులు నీతి నిజాయితీలతో పరీక్షలు నిర్వహించినప్పుడు పరీక్షలకు నిజమైన విలువ వస్తుంది. విద్యావిలువలు పెరుగుతాయి. సమాజంలో గుణాత్మకమైన మార్పు వస్తుంది. మన సమాజంలో అలాంటి మార్పు రావాలని, వస్తుందని ఆశిద్దాం.

## వ్యవసాయం

ప్రతి జీవికి ఆహారం కావాలి. ఆహారం లేకుండా ఏ ప్రాణి కూడా జీవించజాలదు. చాలా రకాల జీవులు తమ ఆహారం కోసం ప్రకృతి మీదనే ఆధారపడి వున్నాయి. అంటే ఏ ప్రయత్నం లేకుండా ప్రకృతిలో దొరికే ఆహారాన్ని ఆరగించి అవి జీవిస్తాయన్న మాట. అలా ఆహారం దొరకని పరిస్థితులు ఏర్పడినప్పుడు అవి మరణిస్తాయి

ప్రాచీన కాలంలో మానవులు కూడా ప్రకృతిమీదనే ఆధారపడి జీవించేవారు. అంటే అడవులలో కనిపించే ఏ జంతువులనో వేటాడి ఆహారంగా స్వీకరించేవారు. అంతేకాకుండా అడవులలో లభించే కాయలనూ, పండ్లనూ, దుంపలనూ మొదలగు వానిని భుజించి జీవించేవారు.

ఆలోచనాశక్తి కలిగిన మానవులు సుఖంగా జీవించుట కోసం నిప్పుచేయుట, వంటచేయుట, వ్యవసాయం చేయుట, ఇండ్లు కట్టుకొనుట క్రమక్రమంగా చేర్చుకొన్నారు.

జంతువులను ఉపయోగించి వ్యవసాయం చేయడం నేర్చుకొన్న తర్వాత వ్యవసాయరంగంలో గణనీయమైన మార్పులు వచ్చాయి

నదీతీరాలలో సారవంతమైన భూముల్లో వ్యవసాయంచేస్తూ పంటలు పండించేవారు.

ప్రారంభదశలో విస్థాపన వ్యవసాయ పద్ధతిని అవలంభించేవారు. ఈ పద్ధతిలో ఒక భూమిని ఒకటి రెండు సంవత్సరాలు

మాత్రమే సేద్యం చేస్తారు. భూసారం తగ్గిపోగానే ఆ భూమిని వదిలేసి మరోచోటికి వెళ్ళి సారవంతమైన భూమిలో సేద్యం చేసేవారు.

సేంద్రియ ఎరువుల వాడకం వలన భూసారము పెంచి ఎక్కువ పంటలు పండించవచ్చునని గ్రహించిన తర్వాత విస్తాపన వ్యవసాయ పద్దతి తగ్గిపోయింది.

మానవులు వ్యవసాయం చేయడం నేర్చుకొన్న తొలిరోజుల్లో వ్యవసాయం పూర్తిగా వర్షాల మీదనే ఆధారపడి జరిగేది

వర్షాకాలంలో పంటపొలాలకు సమృద్ధిగా నీరు లభించేది. వర్షాకాలం వెళ్ళిపోయిన తర్వాత తగినంత నీరు లభించక కొన్ని పొలాలు పండేవి. కొన్ని ఎండేవి. ఈ పరిస్థితుల్లో వ్యవసాయం దెబ్బతినేది.

వ్యవసాయరంగంలో నష్టాలు సంభవించినప్పుడు, ఆ నష్టాల నుండి ఎలా తప్పించుకోవాలో, ఏ పద్ధతులు అవలంబిస్తే నష్టాలు రాకుండా వుంటాయో ఆలోచించి ... ఆలోచించి.... నష్టాలు రాని పద్దతిలో వ్యవసాయం చేయడం నేర్చుకున్నారు మానవులు.

నదుల నుండి పంట పొలాలకు కాలువలు త్రవ్వి పంటలు పండించే విధానం తెలుసుకున్న తర్వాత వ్యవసాయ రంగంలో స్థిరత్వం వచ్చిందని చెప్పుకోవచ్చు

ఆనకట్టలు కట్టి చెరువులలో నీరు నిలువ చేసి వ్యవసాయం చేస్తే వ్యవసాయరంగం బాగా అభివృద్ధి చెందుతుందని గ్రహించారు. మానవులు.

మానవులు తమ అనుభవాల ద్వారా ఆలోచనల ద్వారా ప్రాజెక్టులు నిర్మించారు. కాలువలు త్రవ్వి పంట పొలాలకు నీటి సౌకర్యం కల్పించారు.

చెరువులు కట్టడానికి వీలులేని ప్రదేశాలలో బావులు త్రవ్వి కరంటు మోటార్లు వినియోగించి నీటిసౌకర్యం కల్పించుకొంటున్నారు.

ఎక్కువ పంట పండే వంగడాలను వినియోగించుట వలన

రసాయనిక ఎరువులను ఉపయోగించుటవలన వ్యవసాయరంగం బాగా అభివృద్ధి చెందింది. ప్రపంచం మొత్తంమీద కొన్ని లక్షల కోట్ల టన్నుల ఆహార పదార్థాలు ప్రతి సంవత్సరం ఉత్పత్తి అవుతున్నాయి.

అభివృద్ధి చెందిన దేశాలలో వ్యవసాయరంగంలోకి యంత్రాలు వచ్చిచేరాయి. నేల దున్నడానికి, నాటు వేయడానికి, పైరు కోయడానికి ఇలా అనేక రకాల యంత్రాలు వ్యవసాయాభివృద్ధికి దోహదం చేస్తున్నాయి.

అమెరికా సంయుక్త రాష్ట్రాలు, రష్యా, జపాన్, చైనా మొదలగు దేశాలలో యంత్రాల సహాయంతో వ్యవసాయాభివృద్ధి కొనసాగుతూ ఉంది.

వ్యవసాయం ద్వారా కొన్ని పరిశ్రమలు కూడా నడుస్తున్నాయి. చెరకు, జనుము, పత్తి మొదలగు వ్యవసాయ పంటలు ఆయా పరిశ్రమలకు ముడిసరకుగా ఉపయోగపడుతున్నాయి. ఇంతేకాకుండా కోళ్ళ పెంపకం, పందుల పెంపకం, పాడిపరిశ్రమ ఇవికూడా వ్యవసాయ రంగంమీద ఆధారపడి అభివృద్ధి చెందుతున్నాయని చెప్పుకోవచ్చు. రైసు మిల్లులు, పిండి గిర్నీలు, బిస్కటు పరిశ్రమ, బేకరీలు ఇవన్నీ వ్యవసాయరంగం మీద ఆధారపడినవే.

ఈనాడు దాదాపు అన్ని దేశాలలోని మైదానాలలో, పీఠభూములలో వ్యవసాయం అభివృద్ధి చెందింది. ఇంకా అభివృద్ధి చెందుతూవుంది.

వరి, గోధుమ, చెరకు, మొక్కజొన్న, వేరుశనగ మొదలగు అనేక పంటలు పండిస్తున్నారు.

మానవుల మనుగడకు, అభివృద్ధికి నాగరికతకు మూలం వ్యవసాయం. అనేక రంగాలలో మానవులు అభివృద్ధి చెందుటకు ప్రధానకారకం వ్యవసాయం.

కొన్ని వందల కోట్ల మానవులు, కొన్నివేల కోట్ల పశుపక్ష్యాదులు వ్యవసాయరంగంమీద ఆధారపడి జీవిస్తున్నాయి.

వ్యవసాయరంగంలో ఇంకా ఇంకా అభివృద్ధి జరగాలి. దాని కోసం మన విద్యావిధానం కూడా దోహదం చెయ్యాలి.

## సూర్యుడు

సూర్యుణ్ణి దేవునిగా భావించి పూజిస్తారు. కొందరు.

సూర్యుడు ఏడు గుర్రాల రథం మీద తూర్పు దిశ నుండి పడమటి దిశకు ప్రయాణం చేస్తాడని అంటుంటారు కొందరు.

సూర్యుని భార్య పేరు ఛాయాదేవి అని కథలు చెప్తుంటారు కొందరు.

ఆంజనేయుడు పుట్టగానే సూర్యునివద్దకు పరుగెత్తి సూర్యుణ్ణి మింగబోయాడని, అప్పుడే అతని మూతి కాలిందనీ.... ఇలా కథ చెప్తారు కొందరు.

సూర్యుని వలన కుంతీదేవికి కర్ణుడు పుట్టాడని భారతంలో కన్పించే కథ.

సూర్యగ్రహణానికి రాహువు, కేతువులు కారకులని ఒక కథ మనం వింటూ ఉంటాం.

ఇవన్నీ కథలు, కల్పనలు మాత్రమే.

అసలు విషయం ఏమిటంటే—

అనంతమైన ఆకాశంలో పాలపుంత ఉంది. ఈ పాలపుంతలో లెక్కలేనన్ని నక్షత్రాలున్నాయి ఒక్కొక్క నక్షత్రమండలంలో గ్రహాలు, ఉపగ్రహాలు ఉల్కలు, తోకచుక్కలు, ఆస్టిరాయిడ్లు, ప్లానెటాయిడ్లు అనే చిన్న గ్రహాలు అనేకం ఉంటాయి.

మనకు అతి సమీపములో ఉన్న నక్షత్రాన్ని, మనం సూర్యుడు అనే పేరుతో పిలుస్తున్నాము. నక్షత్రం అంటే స్వయం ప్రకాశశక్తి కలిగినవాడు అని అర్థం

సూర్యుడు మండుచున్న వాయుగోళమనీ, సూర్యుని మధ్య

భాగంలో పదిలక్షల డిగ్రీల వేడి ఉందనీ, అంచులలో ఆరు వేల డిగ్రీల వేడి ఉందనీ శాస్త్రజ్ఞులు చెప్తున్నారు.

సూర్యుడు కదలడనీ, నవగ్రహాలే సూర్యునిచుట్టూ తిరుగుతున్నా యనీ మేధావులు తెలుసుకున్నారు.

భూమి మొదలగు నవగ్రహాలు సూర్యుని నుండి వెలుపడినవే నంటారు శాస్త్రజ్ఞులు. మన భూమి సూర్యుని నుండి విడిపోయి ఇప్పటికి 450 కోట్ల సంవత్సరాలు అయిందట.

సూర్యుని చుట్టూ తొమ్మిది గ్రహాలు తిరుగుతున్నాయి. ఆ గ్రహాల చుట్టూ 31 ఉపగ్రహాలు తిరుగుతున్నాయి.

సూర్యుని చుట్టూ తిరిగే నవగ్రహాలలో భూమి ఒకటి. భూమి చుట్టూ తిరిగే ఉపగ్రహమే చంద్రుడు.

మనకు సూర్యుని నుండి వేడి, వెలుతురు లభిస్తున్నాయి. సూర్యుని నుండి బయలుదేరిన కిరణం భూమిని చేరడానికి సుమారు ఎనిమిది నిమిషాల సమయం పడుతుంది. సూర్యునికి భూమికి మధ్య దూరం పదిహేను కోట్ల కిలోమీటర్లు.... సూర్యుడు భూమికంటె పదమూడు లక్షల రెట్లు పెద్ద.

సూర్యుని యొక్క కిరణాలు చంద్రునిమీద పడి ఆ కిరణాలే మన భూమిని చేరుతున్నాయి చంద్రుని మీదినుండి వచ్చిన ఆ కిరణాలనే మనం వెన్నెల అంటున్నాము. రాత్రివేళ చంద్రుడు అందంగా ముద్దుగా కనిపించడానికి మూలకారకుడు సూర్యుడే.

భూమి తనచుట్టూతాను తిరుగుతూ, సూర్యునిచుట్టు తిరుగుతూ ఉంది. ఇలా తిరగడంలో రాత్రింబవళ్ళు ఋతువులు ఏర్పడు తున్నాయి.

అమావాస్య రోజున సూర్యగ్రహణం ఏర్పడుతుంది. అయితే ప్రతి అమావాస్య రోజున సూర్యగ్రహణం ఏర్పడదు. కాని సూర్యుడు, చంద్రుడు, భూమి వరుసగా ఒక సమతల కక్ష్యలోనికి రావడం

తటస్థించినప్పుడు పాక్షిక సూర్యగ్రహణమో, సంపూర్ణ సూర్య గ్రహణమో, కంకణ సూర్యగ్రహణమో ఏదో ఒక రకమైన సూర్య గ్రహణం ఏర్పడుతుంది.

వర్షం కురియడానికి ప్రధాన కారకుడు సూర్యుడు. చెట్లు, జంతువులు, పక్షులు, మనుషులు మొదలగు ప్రాణులన్నీ పుట్టడానికీ, పెరగడానికీ మూలకారకుడు సూర్యుడు. ప్రాణులన్నిటికీ ఆహారం దొరుకుతుందీ అంటే అదీ సూర్యుని వల్లనే............ఇలా అనేక విషయాలకు అసలు కారకుడు సూర్యుడే.

సౌరకుటుంబములోని రహస్యాలు, వింతలు, విశేషాలు తెలుసుకోవడానికి మనం ఇంకా ఎంతో కృషి చేయవలసి వుంది.

# నదులు

చరిత్ర పుటలు తిరగవేస్తే నదులకు, నదీ తీరప్రదేశాలకు ప్రముఖస్థానం ఉన్నట్లు మనకు తెలుస్తుంది.

పూర్వకాలపు మానవులు నదులకు దగ్గరగా నివసించేవారు. వారు నది నీటిని త్రాగడానికి, స్నానం చేయడానికి, వంటలు చేసుకోవడానికి, పంటలు పండించు కోవడానికి ఉపయోగించు కొనేవారు.

నదులలో చేపలు పట్టి ఆహారంగా స్వీకరించేవారు. నదులపై ఓడల సాయంతో ఒక చోటునుండి మరోచోటికి ప్రయాణం చేసేవారు. ఈ విధంగా నదులు అనాది కాలం నుండి నేటి వరకు మానవజాతికి ఎన్ని రకాలుగానో ఉపయోగపడుతూ వస్తున్నాయి.

నదులు సాధారణంగా ఎత్తయిన ప్రదేశాలలో జన్మిస్తాయి. ప్రపంచములో పేర్కొనదగిన నదులలో ఎక్కువ నదులకు జన్మస్థానాలు పర్వతాలే.

పర్వతాలపై జన్మించే నదులు లోయల్లో పరుగెత్తి.

మైదానాలలో మంద గమనాన్ని సాగించి డేల్టా ప్రాంతములో అనేక భాగాలుగా చీలిపోయి సముద్రంలో కలుస్తాయి.

పర్వతరాజు "నదీసుందరి" తండ్రి అయితే సాగరరాజు "నదీసుందరి' భర్తగా మనం భావించవచ్చు.

వర్షాకాలంలో నదులు పర్వతాలపై పుడుతాయి. అవి ప్రవహించే సందర్భములో తమతోపాటు మట్టి కణాలను చెత్తా చెదారాన్ని ఆకులను మొదలగు వానిని మోసుకొనివచ్చి మైదానాలలో క్రమక్రమంగా వదిలి పెడుతాయి. డేల్టాలు ఏర్పడడానికి నదులే కారణం.

డేల్టాలు సారవంతమైన భూములు. ఇక్కడ పుష్కలంగా పంటలు పండించుటకు అవకాశముంది.

నదీతీర ప్రదేశాలలో గడ్డి, చెట్లు సమృద్ధిగా పెరుగుతాయి. అందువలన మానవులే కాకుండా అనేక రకాల జంతువులు కూడా ఇక్కడ జీవిస్తాయి. ఆవులు, బర్రెలు, గొర్రెలు, గుర్రాలు మొదలగు జంతువులు నదీతీర ప్రదేశాలలో ఎక్కువగా కన్పిస్తాయి.

ప్రపంచం మొత్తంమీద కొన్ని వేల నదులు ప్రవహిస్తున్నాయి.

ఆఫ్రికా ఖండములోని నైలునది, ఉత్తర అమెరికా లోని మిసిసిపి, దక్షిణ అమెరికా లోని అమెజాన్ నదులు పేర్కొన దగిన పెద్దనదులు యూరఫ్ ఖండములో, ఆస్ట్రేలియా ఖండములో తక్కువ నిడివి కలిగిన నదులు అనేకం ప్రవహిస్తున్నాయి ఆసియా ఖండములో హొయాంగ్ హో, గంగ, సింధు, బ్రహ్మపుత్ర మొదలగు నదులను పేర్కొనవచ్చును.

దక్షిణ భారతదేశంలో గోదావరి, కృష్ణ నదులు పీఠభూమిపై ప్రవహిస్తున్న జీవనదులు. జీవనది అంటే సంవత్సరం పొడవునా ప్రవహించేనది అని అర్థం. నదులలో కొన్ని వర్షాకాలంలో మాత్రమే ప్రవహించి తర్వాత ఎండిపోతాయి. ఉత్తరభారతదేశంలో గంగానది

సర్వదా ప్రవహించే జీవనది. దీనిలో స్నానం చేస్తే పుణ్యం వస్తుందని భారతీయులలో చాలా మందికి విశ్వాసం ఉంది.

నదీతీరాలలో నివసించేవారు నదుల నుండి పంట పొలాల వరకు కాలువలు త్రవ్వి, నది నీటితో పంటలు పండిస్తారు.

నదులకు ఆనకట్టలు వేసి చెరువులు, ప్రాజెక్టులు నిర్మిస్తారు. ఉత్తర భారత దేశంలో నిర్మించిన బాక్రానంగల్ ప్రాజెక్టు, దామోదర్‌లోయ ప్రాజెక్టు చెప్పుకోదగినవి. దక్షిణ భారత దేశంలో గోదావరి నదిపై పోచంపాడు ప్రాజెక్టు, కృష్ణానదిపై నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మించడం జరిగింది.

నాగార్జునసాగర్ ప్రాజెక్టు ఆంధ్రప్రదేశ్‌లో చెప్పుకోదగిన యాత్రా స్థలంగా మారిపోయింది.

నదులపై అనేకచోట్ల ఆనకట్టలు కట్టి ఇటు వ్యవసాయరంగాన్ని అభివృద్ధి చేసుకోవచ్చు మరోవైపు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసి పరిశ్రమలు నడుపుకోవచ్చు. చెరువులలో చేపలు, పక్షులు పెంచుకోవచ్చు. చెరువులపై రవాణాసౌకర్యం కల్పించుకోవచ్చు.

కొన్ని నదులు కథలలో కన్పిస్తాయి. పాత్రలుగా అవతరించి కథను నడిపిస్తాయి. రామాయణంలో గంగానది కన్పిస్తుంది. సీతారామ లక్ష్మణులు పడవలో కూర్చొని గంగానది దాటినట్టు మనమీ కథలో చదువుతాం. విశ్వనాథ సత్యనారాయణ గోదావరి నదిని, కిన్నెరసాని నదిని పాత్రలుగా స్వీకరించి "కిన్నెరసాని పాటలు" అనే గ్రంథాన్ని చాలా రసవత్తరంగా వ్రాశారు. నదుల వివరాలు తెలుపుతూ, ప్రాముఖ్యతను వివరిస్తూ కొన్ని గ్రంథాలు కూడా వెలువడ్డాయి.

భూగోళశాస్త్రములో నదులవలన కలిగే లాభాలు వివరించబడి వుంటాయి. ప్రపంచ పటాలలో. దేశ పటాలలో ముఖ్యమైన నదులను ప్రత్యేకంగా పేర్కొంటారు.

విజ్ఞానసముపార్జనలో భాగంగా ముఖ్యమైన నదుల జన్మ

స్థానాలను, సముద్ర సంగమ స్థానాలను, ఆయా నదులపై కట్టబడిన ప్రాజెక్టులను మొదలగు వివరాలు తెలుసుకొని జ్ఞప్తియందుంచుకొనుట మంచిది.

## జ నా భా

మనకు తెలిసినంతవరకు మన సౌరకుటుంబములో మన భూమి మీద మాత్రమే మానవజాతి ఉంది. ఈ భూమి మీద ఉన్న మొత్తం జనాభాను ప్రపంచ జనాభా అంటున్నాము. అలాగే దేశంలో ఉన్న మానవ సమూహమును దేశ జనాభా అని పేర్కొంటున్నాము. రాష్ట్ర జనాభా, జిల్లా జనాభా, మండల జనాభా, గ్రామ జనాభా, పట్టణ జనాభా అంటూ ప్రాంతాలవారీగా జనాభాను పేర్కొంటున్నాము.

భూమి ఉపరితలం మీద మూడింట రెండు వంతులకన్న ఎక్కువగా నీరు సముద్రాల రూపంలో వ్యాపించి వుంది. సముద్రాల మీద పంటలు పండించడానికి గానీ, ఇండ్లు కట్టుకోవడానికి గానీ సాధ్యం కాదు. కనుక మానవులు నివసించడానికి వీలుండదు. ఈ సముద్రాలు చేపలు పట్టుకోవడానికీ పడవల సాయంతో ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి వెళ్ళడానికి ఉపయోగపడుతుంటాయి. అంటే భూమి మీద మూడింట రెండువంతులకన్న ఎక్కువ భాగం జనాభా విస్తరించడానికి వీలులేనటువంటిది. భూభాగంలో జనాభా విస్తరించి వుంది. ఈ భూభాగంలో కూడా పర్వతాలు, సరస్సులు, నదులు, ఎడారులు, మంచు ఎడారులు, మానవ నిర్మితాలైన ప్రాజెక్టులు విస్తరించి ఉన్నాయి. పర్వతాల మీద జనసంఖ్య అతిస్వల్పంగా ఉంటుంది. ఎడారులలో అయితే ఒయాసిస్సులు ఉన్నచోట కొంత జనాభా ఉంటుంది. సారవంతమైన మైదానాల్లో, నీటి సౌకర్యం ఉన్న ప్రాంతాల్లో పంటలు బాగా పండుతాయి కనుక జనసంఖ్య ఎక్కువగా

ఉంటుంది.

మిసిసిపి మైదానం, అమెజాన్ మైదానం, హొయాంగ్‌హో మైదానం, మన దేశంలో అయితే గంగాసింధు మైదానం సారవంత మైన మైదానాలు కాబట్టి జనాభా ఎక్కువగా ఉంది.

టోక్యో, మాస్కో, న్యూయార్క్, లండన్, కలకత్తా, బొంబాయి లాంటి నగరాలలో పరిశ్రమలు అభివృద్ధి చెందడం వలన జనాభా అత్యధికంగా ఉంది.

అంటువ్యాధులు వ్యాపించినప్పుడు, వరదలు, ఉప్పెనలు సంభ వించినప్పుడు జనాభా తగ్గుతుంది. యుద్ధాలు, భూకంపాలు, అగ్ని ప్రమాదాలు మొదలగువానివలన కూడా జనాభా తగ్గుతుంది.

పంటలు సమృద్ధిగా పండడం వలన ఆకలిచావులు తగ్గి పోయాయి వైద్యశాస్త్రం అభివృద్ధి చెందడం వలన మరణాల సంఖ్య తగ్గిపోయింది. దంపతుల సంఖ్య పెరగడం వలన జనాభా పెరిగింది.

అకాల మరణాలవలన జనాభా తగ్గిపోతే ఎంత నష్టమో, అంతులేకుండా జనాభా పెరిగిపోతే కూడా అంతే నష్టం. అందుకే కుటుంబనియంత్రణ పథకం, కుటుంబ సంక్షేమ పథకం లాంటివి అమలులోకి వస్తున్నాయి.

ఏ దేశానికైనా వనరులకు తగిన జనాభా ఉండాలి.

# పుస్తకాలు

విజ్ఞానాన్ని భద్రపరచడానికీ, ఒకరి జ్ఞానాన్ని మరొకరు పొందడానికీ, విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవడానికీ ఉపకరిస్తాయి పుస్తకాలు.

మానవులు తమ భావాలను ఇతరులకు తెలపడానికి సంకేతాలను (అక్షరాలను) ఏర్పాటు చేసుకున్నారు మనకు తెలిసినంతవరకు మన పూర్వీకులు "ఘంటం" అనే పరికరంతో తాటి కమ్మల మీద,

అక్షరాలు రాసి, భావాలను ప్రకటించారు. అలా ప్రకటించిన భావాలను భద్రపరచడానికి వీలయింది. భావితరాల వారు కూడా జ్ఞానం పొంద డానికి వీలయింది. ఈ పద్ధతి వలన కొద్ది కాలంలోనే ఎక్కువ విజ్ఞానం సంపాదించే అవకాశం ఏర్పడింది.

గడ్డి, వెదురు మొదలగు పదార్థాలను గుజ్జుగా తయారుచేసి కాగితం తయారు చేయడం నేర్చుకున్నాక మానవ విజ్ఞానాభివృద్ధి మరింత చురుకుగా కొనసాగిందని చెప్పుకోవచ్చు. అచ్చు యంత్రం కనిపెట్టిన తర్వాత పుస్తకాలు అచ్చువేయడం ద్వార విజ్ఞానాన్ని భద్రపరచడం సులభతరం అయింది.

ఒక ప్రాంతం వారు మరో ప్రాంతం వారికీ, ఒక దేశం వారు ఇతర దేశాలవారికి విజ్ఞానాన్ని ఇచ్చిపుచ్చుకోవడం పుస్తకాలవలననే సులభసాధ్యమయిందని చెప్పవచ్చును.

ప్రపంచములో మొట్టమొదటి పుస్తకం ఏ దేశం వారు ప్రచురించారు? ఆ పుస్తకం ఏ భాషలో ప్రచురింపబడింది? ఆ పుస్తకాన్ని ఎవరు వ్రాశారు? అనే అంశాలను పరిశోధకులకు వదిలేద్దాం.

ఈనాడు ప్రపంచములో అన్ని దేశాలలో అనేక భాషల్లో పుస్తకాలు ప్రచురింపబడుచున్నవి. పుస్తకాలను ఇచ్చి పుచ్చుకోవడం కూడా జరుగుచున్నది. గ్రంథాలయాలను ఏర్పాటు చేసి పుస్తకాలను భద్రపరచడం కూడా జరుగుచున్నది. గ్రంథాలయాలలో భాషల వారిగా విభాగాలు ఏర్పాటుచేసి పుస్తకాలను చదువరులకు అందు బాటులో ఉంచడం కూడా జరుగుచున్నది.

ఒక్కొక్క భాషలో సాహిత్య ప్రక్రియలను బట్టి పుస్తకాలను పేర్కొనవచ్చును. నవలలు, నాటికలు, కథలపుస్తకాలు, పద్యాలు, పాటలు, గేయసంకలనాలు, గేయనాటికలు, వచనకవితలు, వ్యాసాలు పరిశోధనా గ్రంథాలు, సైన్సు పుస్తకాలు, రాజకీయ, ఆర్థిక రంగాలకు

చెందిన గ్రంథాలు, బొమ్మలపుస్తకాలు. గణితము, ఖగోళ, భూగోళ శాస్త్రి గ్రంథాలు ఇలా ఎన్నో గ్రంధాలు మనకు ఎదురవుతూఉంటాయి.

ఆ పుస్తకాలు మౌనంగా ఇలా అంటాయనుకుంటాను. మాలో ఎంతో విజ్ఞానం ఇమిడివుంది చదువుకో, నేర్చుకో, తెలివి పెంచుకో, సుఖపడడానికి, సంస్కారం పెంచుకోపడానికి మేము ఎంతో ఉపయోగపడుతాము.

మనిషి పుట్టిన తర్వాత తల్లిదండ్రుల దగ్గర ఇరుగు పొరుగు వారి దగ్గర కొంత జ్ఞానాన్ని పొందుతాడు పాఠశాలకు వెళ్ళిన తర్వాత పుస్తకాల్ల సాయంతో అనేక కొత్త విషయాలు తెలుసుకొని కొత్తజ్ఞానాన్ని పొందుతాడు.

గత చరిత్ర తెలుసుకోవాలన్నా, నీతి వాక్యాలు నేర్చుకోవాలన్నా, రాజకీయ పరిజ్ఞానం సంపాదించాలన్నా, అభివృద్ధి చెందుతున్న శాస్త్రజ్ఞానాన్ని అందుకోవాలన్నా, ఇతర దేశస్థుల ఆచార వ్యవహారాలు గ్రహించాలన్నా ఏ రంగంలో అభివృద్ధి చెందాలనుకున్నా అత్యధికంగా ఉపకరించేవి పుస్తకాలు

ఎవరికి ఏ రంగంలో అభిరుచి ఉంటుందో ఆ రంగానికి చెందిన పుస్తకాలను ఎన్నుకొని చదువుకోవడం మంచిది. మంచి పుస్తకాలు మంచి స్నేహితులవలె మేలు చేస్తుంటాయి.

తెలుగులో మంచి పుస్తకాలను ఎన్నుకొని ప్రచురించడం తెలుగువారి బాధ్యత. ఈ పుస్తకాలే బావితరాలవారికి ఉపయోగపడుతాయి

## వంట

నిప్పు కనిపెట్టిన తర్వాత వంట చేయడం నేర్చుకున్నాడు మానవుడు. మొదటి దశలో కాయలను, దుంపలను, మాంసమును మంటల్లో కాల్చి తినేవాడు.

పాత్రలు చేయడం తెలుసుకొన్న తర్వాత నీటిలో ఆహార పదార్థాలను ఉడికించి తినేవాడు. ఉడికించిన ఆహారాన్ని తింటే సులభంగా జీర్ణమవుతుందని తెలుసుకున్నాడు మానవుడు.

వేల సంవత్సరాల మానవ చరిత్రలో వంట ప్రాముఖ్యత వంటకు ఉండనే ఉంది.

ప్రతిరోజూ ప్రతి ఇంటిలో వంట తయారు కావలసిందే ఇంటి లోని వారందరూ ఆ వంటకాలను తినవలసిందే.

చక్రవర్తులు, రాజులు, మంత్రులు, ఉన్నతాధికారులు, మామూలు ప్రజలు, బంట్రోతులు ఇలా అన్ని తరగతులవాళ్లూ వండిన వంట తినవలసిందే.

వంటచేయడం చాలా మందికి తెలుసు. కాని రుచికరంగా వంట చేసేవాళ్లు కొద్దిమంది మాత్రమే వుంటారు.

వంట చేయడం అనేది ఒక పని. కాని రుచికరంగా వంట చేయడం అనేది ఒక కళగా భావించాలి మనం. చరిత్ర తిరగవేస్తే పురాణాలు విప్పిచూస్తే రుచికరమైన వంటల గురించి ఆ వంటలు తయారుచేసిన వాళ్ళ గురించి కొంత సమాచారమైనా పొందకపోము.

పూర్వకాలంలో వంటలు మొగవాళ్లు చేసేవాళ్లా? ఆడవాళ్లు చేసేవాళ్లా? అనేది ఒక ప్రశ్న. ఆడవాళ్ల విషయం ఎలా ఉన్నా వంట చేసిన మగవాళ్ల పేర్లు మనకు కొన్ని కన్పిస్తూఉంటాయి. నలపాకము, భీమపాకము ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. నలుడు, భీముడు రుచికరంగా వంటలు చేసినవాళ్లు అయిఉండవచ్చు. అందుకే వాళ్ళ పేర్లు వంటశాస్త్రములో నిలిచిపోయాయి.

ఎక్కువ పరిమాణంలో వంట చేయవలసివచ్చినప్పుడు ఈనాటికీ మొగవాళ్ళ పాత్రే వంటలలో ఎక్కువగా ఉన్నట్టు మనం గమనిస్తూ ఉంటాము, కాని ప్రతిరోజూ ప్రతి ఇంటిలో ఎక్కువశాతం ఆడవాళ్లే వంటచేయడం మనం చూస్తూ ఉంటాము.

వంట ఆడవాళ్లు చేసినా మగవాళ్లు చేసినా రుచికరంగా వంట చేసేవాళ్లకు ఒక ప్రత్యేకత ఉంటుంది. వాళ్ల పేర్లు ఆ వాడలో ఈ వాడలో ఈ ఊళ్లో ఆ ఊళ్లో గొప్పగా చెప్పుకోవడం కూడా జరుగుతూ ఉంటుంది.

వంటలలో ఎన్నెన్ని రకాలో .... .... .... పరిశీలించి రాస్తే, పరిశోధించి రాస్తే అది గొప్ప గ్రంధమవుతుంది.

కారపు వంటలు, తీపి వంటలు .... .... .... నీటిలో ఉడికించే వంటలు, నూనెలో కాల్చే వంటలు, నూనెలో గోలించి నీటిలో ఉడికించే వంటలు........ ఊరగాయలు, కాయగూరలు, మాంసపు కూరలు....... లడ్డూలు, జిలేబీలు, పూరీలు, పేనీలు గారెలు, బూరెలు, అట్లు, పిట్లు.... పొలావ్, బిర్యాని.... ... ఇలా వంటల పేర్లన్ని చెప్పుకుంటూపోతే ఆ పేర్ల లిస్టు ఆంజనేయుని తోకంత ఉంటుంది.

వంటల గురించి అనేక భాషల్లో గ్రంధాలు ప్రచురించబడ్డాయి. ఆధునిక ఆంధ్ర రచయిత్రులు తెలుగు భాషలో వ్యాసాలు వ్రాసి ప్రచురించారు తెలుగు వంట సాహిత్యానికి, తెలుగు మహిళా లోకానికి వారు ఎంతో సేవ చేశారని చెప్పుకోవచ్చు.

వంటల పుస్తకాలు చదివి రుచికరంగా వంట చేయగలమా ? అనేది ఒక ప్రశ్న ? ............ ఏమోమరి .. ....

రుచికరంగా వంట చేసే వాళ్లందరూ వంటల గురించి పుస్తకాలు రాయగలరా ? ......... రాశారామరి?

"పాకశాస్త్రం" ఒక శాస్త్రంగా పాఠ్య పుస్తకంగా వచ్చి విద్యార్థులను పాకశాస్త్ర ప్రావీణ్యులను చేస్తుందా?........చేస్తుందని ఆశిద్దాం.

రుచికరమైన ఆహారపదార్థాలు ఆరగించుమని ఆహ్వానిస్తున్నాయి నేను వంటింట్లోకి వెళ్తున్నాను. ఆకలిగా వుంటే మీరు వంటశాలలోకి వెళ్లండి.

రేగులపాటి కిషన్‌రావు

# విద్య

విద్య అంటే చదువు, జ్ఞానము, తెలివి అనే అర్థాలు ఉన్నాయి. విద్య నేర్చిన వ్యక్తిని విద్యావంతుడంటారు అక్షరజ్ఞానం, తెలివితేటలు రెండూ కలిగి ఉండడం విద్యావంతుని ప్రధాన లక్షణంగా మనం చెప్పుకోవచ్చు.

అక్షర జ్ఞానం లేనివారు కూడా కొందరు కొన్ని విద్యలలో ఆరితేరినవారున్నారు

పరకాయ ప్రవేశవిద్య, జలస్తంభన విద్య ............ ఇలాంటి పదాలు, విద్యలు పూర్వ గ్రంథాలలో చూస్తూ ఉంటాము, చదువుతూ ఉంటాము.

ఒకప్పుడు చాల విద్యలు పురుషులకు మాత్రమే పరిమితమై ఉండేవి. తర్వాత కాలంలో స్త్రీలు కూడా పురుషులవలెనే అనేక విద్యలలో ప్రావీణ్యతను సంపాదించారు, అప్పటినుండి "ముదితల్ నేర్వగ రాని విద్యకలదే ముద్దార నేర్పించినన్" అనే మాట కూడా ప్రచారంలోకి వచ్చింది.

పూర్వకాలంలో విద్యార్థులు గురువుగారి ఆశ్రమంలో ఉంటూ విద్యనేర్చేవాళ్లు. కాగితాలు లేని ఆ రోజుల్లో గురువుగారు చెప్పగా విని వల్లె వేసి విద్యనేర్చేవారు శిష్యులు. వారు ఆశ్రమంలోనే వ్యవసాయపు పనులు, కట్టెలు కొట్టడం, బట్టలు ఉతకడం, పరిసరాల పరిశుభ్రత మొదలగు పనులు నేర్చుకునేవారు.

క్షత్రియ బాలురైతే అక్షర విద్యతో పాటు విలువిద్య, కత్తి విద్య, గుర్రపుస్వారి.........మొదలగు విద్యలు కూడా నేర్చుకునేవారు.

గురువులు బుద్ధిమంతులైన శిష్యులకు విద్యలలోని మర్మములను చెప్పుతుండేవారు.

భారతంలో కనిపించే గురువు ద్రోణాచార్యులు. ఇతని

శిష్యులందరిలో ప్రప్రథమంగా పేర్కొన తగినవాడు అర్జునుడు. ఇతడు విలు విద్యలో నేర్పరి.

ఏకలవ్యుడు క్షత్రియుడుకాకపోయినా ద్రోణున్ని గురువుగా భావించి గురువుతో సంబంధం లేకుండా తన సహజశక్తితో విలు విద్య నేర్చిన నేర్పరి.

విద్య నేర్వడంలో పట్టుదల, పోటీస్ఫూర్తిభావం ఉండాలి. అప్పుడే విద్య అబ్బుతుంది. అందుకే "పూను స్పర్థలు విద్యలందే............ అన్నారు గురజాడ మహాకవి

"కోటి విద్యలు కూటి కొరకే" "విద్యలేనివాడు వింతపశువు" అనేవి సామెతలు. సామెతల మాట ఏలాఉన్నా మనిషి సుఖపడాలంటే విద్యావంతుడై ఉండాలి విద్యావంతుడు సుఖపడే మార్గాలు అన్వేషిస్తాడు. సమాజాభివృద్ధికి కావలసిన ధర్మాలు, పద్ధతులు ప్రవేశ పెడుతాడు. ఉత్పత్తి ప్రక్రియలు సులభతరం చేస్తాడు. నూతన యంత్రాలు కనుక్కుంటాడు. ప్రకృతి రహస్యాలు తెలుసుకొని ఆ జ్ఞానాన్ని సమాజాభివృద్ధి కోసం వినియోగిస్తాడు.

విద్యార్థులు పాఠశాలల్లో, కళాశాలల్లో ప్రవేశించి అక్షర జ్ఞానంతో విద్యలు అభ్యసిస్తారు.

భాషాసంబంధమైన విద్య, సాంఘికవిద్య, విజ్ఞానశాస్త్రం గణితము మొదలగు విద్యలు నేర్చుకుంటారు.

కొందరు పాలిటెక్నిక్, ఇంజనీరింగ్, వైద్య విద్య............ మొదలగు విద్యలు నేర్చి సమాజానికి ఉపయోగ పడుతుంటారు.
నోటుపుస్తకాలు, పాఠ్యపుస్తకాలు, పటాలు అట్లాసులు, టేపురికార్డర్లు రేడియోలు, వీడియోలు, టెలివిజన్లు........ విద్య నేర్పడానికి, నేర్వడానికి ఉపకరిస్తున్న పరికరాలు.

ఏ ప్రాంతం వెళ్లినా ఉపకరిస్తుంది విద్య. అపరిచితులను పరిచయం చేస్తుంది విద్య. స్నేహం పెంచేది విద్య, సుఖం పెంచేది

విద్య, ప్రగతినిచ్చేది విద్య.

అందుకే అందరూ విద్యావంతులు కావడానికి, విద్యలలో ప్రావీణ్యత పొందడానికి కృషి చేయాలి.

## ఇల్లు

"ఇల్లు కట్టిచూడు పెళ్ళి చేసిచూడు" అన్నారు పెద్దలు ఇల్లు కట్టడమూ, పెళ్ళిచేయడమూ రెండూ శ్రమతోకూడిన పనులే అని అనుభవజ్ఞుల మాటల సారాంశం.

ప్రతి మనిషికీ తలదాచుకోవడానికి ఒక ఇల్లు కావాలి. తలదాచుకోవడం అంటే ఎండనుండి, వాననుండి, చలినుండి రక్షణ పొందడం అన్నమాట.

నగరాలలోనూ, పట్టణాలలోనూ కన్పించే ఇండ్ల విషయం ఎలా ఉన్నా పల్లెటూర్లలో ఈనాడు మనకు కన్పించే ఇండ్లలో ఎక్కువ ఇండ్లు అసలు ఇండ్లేకావు. వాటిని చీకటి గుహలనో, ఎలుకల కన్నాలనో, పశువుల కొట్టాలనో ఇంకా ఇలాంటి ఏదో పేరుతో పిలిస్తే సరిపోతుందనుకుంటాను

అసలు ఇల్లంటే ఎలా ఉండాలి? ఎక్కడ నిర్మించుకోవాలి? ఎలా నిర్మించుకోవాలి? ఈ విషయాలు బాగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవలసిన విషయాలు.

ఇల్లు కట్టుకోవడానికి ఎత్తైన ప్రదేశాన్ని చదునైన ప్రదేశాన్ని ఎన్నుకోవడం మంచిది. ఎన్నుకున్న ప్రదేశంలో మధ్యభాగంలో ఇంటికి లోతైన పునాదులు, బలమైన పునాదులు ఏర్పాటు చేసుకోవాలి.

గోడల విషయం చెప్పుకున్నప్పుడు మట్టి గోడలకన్నా ఇటుక గోడలు, ఇటుక గోడలకన్నా రాతి గోడలు దృఢంగా ఉంటాయని చెప్పుకోవచ్చు గోడలు దృఢంగా ఉంటేనే ఇల్లు ఎక్కువకాలం మనగలుగుతుంది.

మన అవసరాలను ఆర్థిక స్తోమతను దృష్టియందుంచుకొని తగినన్ని గదులు నిర్మించుకోవడం మంచిది.

ద్వారాలు, కిటికీలు తగినన్ని అమర్చుకోవాలి. గాలి నిరాటకంగా వచ్చి వెళ్లడానికి వీలుగా వీటిని అమర్చుకోవాలి. దీని వలన వెలుతురు తగినంత పొందడానికి వీలవుతుంది.

గోడలకు సిమెంటు చేసినయెడల అవి నునుపుగా ఉండుటమే గాక దృఢంగా కూడా ఉంటాయి గోడలకు సున్నం గానీ రంగులు గానీ వేయుట వలన ఇంటి అందం పెరుగుతుంది.

తలుపులకు, కిటికీలకు రంగులు వేయుటవలన వాటి అందం పెరగడమేకాకుండా ఎక్కువకాలం మనగలుగుతాయి.

నేలపైన నాపరాళ్లు పరచుటవలన గానీ, సిమెంటుచేయుట వలన గానీ, ఇంటి అందం పెరగడమే కాకుండ ఇల్లు పరిశుభ్రంగా కూడా ఉంటుంది.

ఇంటికి ఒక ప్రక్కన బావి. బాతురూమ్, లాట్రిన్‌రూమ్ మొదలగునవి ఏర్పాటు చేసుకోవాలి.

పెంకుటిండ్లు, రేకులఇండ్లు, సిమెంటుఇండ్లు చాలకాలం మనగలిగే ఇండ్లు ఈత కిమ్మలతోనూ, తాటి కమ్మలతోనూ, కాశగడ్డితోనూ, తుంగతోనూ నిర్మించుకునే ఇండ్లు కొద్ది కాలంలోనే చెడిపోతాయి.

పశువుల కొట్టాలు, కోళ్ల షెడ్లు కూడా శాస్త్రీయ పద్ధతితోనే నిర్మించుకోవాలి.

ఇంటి వెనుక కూరగాయల చెట్లు, పండ్ల చెట్లు పెంచుకోవాలి. ఇంటిముందు పూల చెట్లు, చల్లని నీడనిచ్చే చెట్లు పెంచుకోవాలి.

కొన్ని ఇండ్ల సముదాయమునే కదా గ్రామం అనేది. ఏ గ్రామంలోనైనా ఇండ్లు ఒక వరుస క్రమములో ఉండాలి. వీధులు విశాలంగా ఉండాలి వీధుల అంచులకు ఇరువైపుల మురికినీటి కాలువలు ఉండాలి.

అనేకమందికి ఉపయోగపడే కట్టడాలలో పాఠశాలలు, వైద్యశాలలు, సినిమాహాళ్లు హోటళ్లు మొదలగు వానిని చెప్పుకోవచ్చు.

మత సంబంధమైన కట్టడాలలో దేవాలయాలను, మసీదులను, చర్చీలను పేర్కొనవచ్చు.

చరిత్ర ప్రసిద్ధిగాంచిన కట్టడాలలో చార్మినార్, మక్కామసీదు. జుమ్మ మసీదు, కుతుబ్ మినార్, చాంద్ మినార్ మొదలగునవి పేర్కొనతగిన అందమైన కట్టడాలు.

సాలార్‌జంగ్ మ్యూజియం హైదాబాద్‌కు, తీన్‌మూర్తి భవన్ ఢిల్లీకి కీర్తిని తెచ్చిపెట్టే కట్టడాలు.

వెయిస్తంభాల గుడి, రామప్ప గుడి, కళాత్మకంగా కట్టిన అపురూపమైన కట్టడాలు.

గోలకొండకోట, ఎర్రకోట పూర్వకాలపు రాజ్య వ్యవస్థను జ్ఞప్తికి తెచ్చే కట్టడాలు.

కట్టడాల విషయం ఆలోచించినప్పుడు ముఖ్యంగా మనం నిత్యం నివసించే ఇండ్ల విషయం ఆలోచించినప్పుడు గాలి, వెలుతురు విషయం తప్పకుండా ఆలోచించాలి.

గాలి వెలుతురు దారాళంగా వచ్చిపోవడానికి వీలగు ఇండ్లనే మనం నిర్మించుకోవాలి. ఎలాంటి ఆర్థిక పరిస్థితి ఉన్న వాళ్ళయినా ఇలాంటి ఇండ్లను నిర్మించుకోవచ్చు.

ఇంటికి ఎంత డబ్బయినా ఖర్చు చేసి దాని అందాన్ని ఆయుష్షును పెంచుకోవచ్చు.

## చిరంజీవులు

ఉత్తములతో అభివృద్ధి చెందే మానవ సమాజములో ఉత్తములే కాకుండ మధ్యములు, అధములు కూడా ఉంటారు.

మనుష్యుల స్వభావాన్నిబట్టి వారు చేసే పనులను బట్టి వారు

పాటించే ధర్మాలను బట్టి ఉత్తములని, మధ్యములని, అధములని పేర్కొనడం జరుగుతుంది.

మానవులలో ఉత్తముల సంఖ్య ఏ కాలంలోనైన ఏ దేశం లోనైన తక్కువగానే ఉంటుంది ఉత్తములు సద్గుణములు కలిగి ఉంటారు. ధర్మములను సక్రమముగా పాటిస్తారు. నీతి నియమాలతో జీవిస్తారు. మానవులందరూ సద్గుణములు కలిగి ఉండవలెనని, ఎవరి ధర్మములను వారు పాటించవలెనని, నీతి నియమాలను పాటిస్తూ జీవించవలెనని వీరు ప్రబోదిస్తారు. వీరు ఇతరులకు మార్గదర్శకులుగా ఉంటారు. ఇతరులకు సహకరిస్తారు. లోకములో ఉన్న చెడును తొలగించుటకు కృషి చేస్తారు. కష్ట నష్టములను లెక్క చేయకుండా ధైర్య సాహసాలతో అవినీతి మీద అధర్మం మీద దాడి చేస్తారు. సమాజభివృద్ధి కోసం తమ సుఖ సంతోషాలను త్యాగం చేస్తారు. మానవ సమాజంలో మంచిని పెంచుటకు వీరు జీవితాంతం కృషి చేస్తారు. వీరి పేర్లు స్థిరస్తాయిగా ఉంటాయి.

ఉత్తమ గుణములు కలవారు మనకు చరిత్ర పుటలలో కొందరైనా కనిపిస్తారు. వారి ఉత్తమ గుణములు స్మరించుకొని ఉత్తమ గుణములు అలవరచుకొనుట మంచిది.

మధ్యములకు అటు మంచి గుణములు గానీ ఇటు చెడు గుణములు కానీ ఉండవు వారు ఉత్తములవలె జీవించలేరు. అధములవలె ప్రవర్తించలేరు ఉత్తముల మాటలువిని ఉత్తములవలె జీవించనెంచెదరు కాని ఉత్తములవలె ఏ త్యాగమూ చేయలేరు. వీరు అధములకు భయపడుతారు. వీరు ఎన్నో నీతి వాక్యాలు వల్లించిననూ, కొన్ని నీతి నియమాలను పాటించకుండానే జీవితం సాగిస్తారు. ఇతరుల కొరకు పేర్కొనదగిన ఏ త్యాగమూ చేయలేరు. వీరు ఎంతకాలం జీవించిననూ సమాజానికి మేలుగానీ, కీడుగానీ జరుగదు. మానవ సమాజంలో మధ్యముల సంఖ్య చాలా ఎక్కువగా ఉంటుంది.

అధములకు ఉండేవి అన్నీ అధమగుణములే. వీరు ఏ ధర్మమునూ పాటించుటకు ఇష్టపడరు. నీతి నియమాలకు చాలా దూరంగా ఉంటారు. కొన్ని ధర్మములను పాటించినట్లు నటిస్తారు, ధర్మాలకు, ధర్మాలు పాటించువారికి హాని చేస్తారు. బ్రతుకుట కొరకు తోటి వారిని హింసిస్తారు. శరీర బలముతో, కుయుక్తులతో ఇతరులను అణచి వేయుటకు ప్రయత్నిస్తారు. బలహీనులను వీరు పూర్తిగా నాశనం చేస్తారు

అధముల వలన సమాజంలో భయము వ్యాపిస్తుంది. సమాజములో జరిగే చెడుకార్యములన్నింటికీ వీరే నాయకత్వం వహిస్తారు. మానవ సమాజానికి వీరు చీడపురుగుల వంటివారు. పురాణాలలోనూ, చరిత్ర పుటలలోనూ వీళ్ల పేర్లు మనకు కన్పిస్తాయి. రాక్షస స్వభావం కలవారందరినీ అధములని పేర్కొన వచ్చును.

ఉత్తముల వల్లనే సమాజం అన్నిరంగాలలో అభివృద్ధి చెందుతుంది ఉత్తములు చాలా కాలం జీవించడానికి అర్హులు. వీరు చిరంజీవులు.

## సత్యం

'సత్యం' అంటే ఉన్నది వున్నట్లు చెప్పడం, విన్నది విన్నట్లు చెప్పడం, చూచింది చూచినట్లు చెప్పడం, చేస్తానన్నది చెయ్యడం, ఇస్తానన్నది యివ్వడం.

సత్యం రత్నం లాంటిది, రవిబింబం లాంటిది. అసత్యం విషసర్పం లాంటిది, విష వాయువు లాంటిది.

సత్యం పలుకుట వలన విలువ పెరుగుతుంది. సత్యం వలన నీతి, న్యాయం ధర్మం మనగలుగుతాయి అందుకే సత్యం పలుకాలి.

అసత్యం పలుకుటవలన విలువ తరుగుతుంది. అసత్యం వలన మానసికారోగ్యం చెడుతుంది. అందుకే అసత్యం పలుకరాదు.

సత్యమేవ జయతే అన్నారు పెద్దలు. అంటే సత్యమే జయిస్తుందని అర్థం, సత్యానికే జయించే శక్తి వుంది అసత్యం అపజయం పొందుతుంది. అందుకే సత్యం పలుకాలి.

సత్యమే దేవుడన్నారు దేవుణ్ని సమర్థించే వాళ్లు దేవుణ్ని ఆరాధించేవాళ్లు, అందుకే సత్యాన్ని సర్వదా ఆరాధించాలి.

## క్రమశిక్షణ

ఆచరించతగిన దానిని నేర్చుకొనుట ఆచరించతగిన దానిని బోధించుట క్రమశిక్షణ ముఖ్యోద్దేశము. చేయతలపెట్టిన పనిని ప్రణాళిక బద్ధముగానూ, శక్తివంతంగానూ చేసి అభివృద్ధిని సాధించుట క్రమశిక్షణ లక్ష్యమని చెప్పవచ్చును.

ప్రతి మనిషికి ప్రతి సమాజానికి, ప్రతి దేశానికి క్రమశిక్షణ అవసరం. మానవజాతి అభివృద్ధికి, ఔన్నత్యానికీ ప్రాణం లాంటిది క్రమశిక్షణ.

క్రమశిక్షణ అనేది చిన్నతనంలోనే అలవాటు కావాలి. పిల్లలకు ఇంటి వద్ద తల్లితండ్రులు పాఠశాలలో ఉపాధ్యాయులు క్రమశిక్షణ నేర్పాలి.

క్రమశిక్షణ పాటించే వ్యక్తులు తాము అభివృద్ది పొందుతూ తోటివారి అభివృద్ధికి కూడా సహకరిస్తారు.

క్రమశిక్షణతో నడిచే సంస్థలు, పరిశ్రమలు తక్కువ కాలంలోనే ఎక్కువ అభివృద్దిని సాధిస్తాయి.

విద్యార్థులైనా, కర్షకులైనా, కార్మికులైనా, కళాకారులైనా ఏ రంగములో పనిచేసే వారైన క్రమశిక్షణ పాటిస్తేనే నైపుణ్యం సాధిస్తారు.

మిత భోజనము మితవ్యయము, మితభాషణము, కాల నియమము పాటించుట, తోటి వారిని గౌరవించుట, సక్రమముగా విధిని

నిర్వహించుట మొదలగు సద్గుణములు క్రమశిక్షణ పాటించే వ్యక్తులలో కనిపిస్తాయి.

క్రమశిక్షణ పాటించే వ్యక్తులే దేశాన్ని అభ్యుదయ పథములో నడిపించగలరు. క్రమశిక్షణ గల వ్యక్తులు ఈనాడైన ఏనాడైన ప్రతి దేశానికీ అవసరం.

-oOo-



*ఈ పుస్తకం లోని వ్యాసాలన్నీ ఇంతకుపూర్వం "కథాంజలి" మాస పత్రికలో ప్రచురింపబడినవి.